శ్రీ రస్తు.

# విశ్వగుణాదర్శము.

రెండవభాగము. వచనము

ఇది

మంగు వేంకట రంగనాథరావువలన

ముద్రించి ప్రకటింపబడియె









మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.
1914

శ్రీ వేంకటేశ్వర విద్యాసాగర ముద్రాక్షరశాల.

వెల 0—2—0

శ్రీరస్తు.

# శ్రీ విశ్వగుణాదర్శము.



## ద్వితీయభాగము-వచనము.

శ్రీకాంచీనగరమునకు భూషయు, భజించువారలకు గర్వమంజరియు సమరసేనలకురక్షయును, భూపతికిసర్వసంపదయు నగుకాంచికామాక్షి విలసిలుచున్నది, అనియద్భుత ప్రమోదంబులొంది, కామాక్షినుద్దేశించి, ఓదేవికామాక్షి నీదంతరుచిమొల్లలను, మోముచంద్రబింబమును, లోచనములు నీలోత్పలములను, వాక్కుమధువును హసించునుగాదె, కృశానుడిట్లనియె కామాక్షి, సౌందర్యమభినందనీయంబైయున్న నువ్యర్థంబైకనుపట్టెడు, మగడువిరూపాక్షుండయ్యె కామహంత, గిరిరాజకుమారిపుత్రుండు గజముఖుడులంబోదరుండు, కావుననంబికాత్ర్యంబకుల దాంపత్యంబనురూపంబుగాదు, మఱియునీయమ సర్వమంగళ, యతడుశ్మశానవాసి యీమెహైమవతి, యాతడుభిక్షువు ఈశంకజాన నకుంకుమాంతయతడు, భస్మముపూసికొన్నవాడు, ఈమెయరాళకుంతల అతడుజటామండల భీషణుడు, అనినవిశ్వావసుండిట్లనియె, వయస్యాయట్లనకు ముక్తిప్రావాసుడుగాని, పిత్రువనంబున నుండనీ, సర్వగణంబులదాల్ప నీశివుండుసుభగుడె, సహజంబగు సౌందర్యంబు, గొఱంతవడదు నాచుచుట్టికొన్నను, అసలునగలిసియున్నను అళులుగ్రిమ్మననువనజంబు సుందరంబుగాదా, పరమణీయుడగు పూరుషుంజూచి, రమణిరంజిల్లు వాడెపురుషుండు, రసికునిచిత్తము రంజింపజేయునదశ్లోకము, ఇక్కడమిక్కిలి చిత్రముగలదువినుము, శివాఖ్యాలోకనంబున గారిణుడుజయంప, బడెనని వింద్రుము కానియిచట, కామాఖ్యాలోకనంబున శివుండుజితుడయ్యె, ఇచటవ్యత్యయమయ్యెజుమీ పార్వతికిప్రత్రిభా

గ్యంబును, పుష్కలమయ్యెహిమగిరిసుతా, ప్రథమతనూజుండు.

ద్వితీయకుమారుండు షడాననుండై, పంచాస్యుండగు తండ్రినధికరించె, కైలాసవాసియగు చంద్రచూడుండు. సహకారమూలంబున నావిర్భవించె యతనియవలోకనతనూభవులగ్నిభవులు, యాతనిభార్యయు భూషలును, నాగరాజ, అనిన గృశానుండు చెలి యేల విశ్వవిలక్షణచరిత్రుడగు రుద్రు వర్ణించెదవు లోకంబుల గన్నులకు జలువసంపాదింపగోరు జనులు జూడుము గాని పశుపతియుష్ణాంశువునైన నీతనింబోలె నశుభూషణింపెట్టినవారిం గానము. అనిన విశ్వావసుండిట్లనియె. సఖా రహస్యము వచించెదవినుము. గంగాసంగతివలనను, జలివలనను, స్వర్గంగాచంద్రసంబంధమువలనను, గలిగిన శైత్యమునుబోగొట్టుకొనుటకు కుంపటింబోలె నగ్నినేత్రమును శివుడు ధరించినాడు. కృశానుండిట్లనియె. నార, తుషారకరశకలంబును, నభోగంగను, గంగను ధరించుటచే జల్లనైన శిరముగలిగియున్న పన్నగాభరణునకు నభిషేకము చేయుటేల. అనిన విశ్వావసుండు నీకుదగిన ప్రత్యుత్తరమిచ్చెదవినుము. లలాటంబున నగ్ని నేత్రము ధరించుటచేతను, విషపానము చేయుటచేతను, విషధరముల భూషణంబులుగ ధరించుటచేతను, శరీరతాపము గలిగియున్నాడు. కావున గంగాధరుండైనను అభిషేకము కావలెను. అగునది యట్లుండనిమ్ము. ఏకతంబున నీచందురుండాకసంబునిడిచి శివునిశిరంబున గంగాతరంగంబుల గ్రస్తాంగుడై యుండె. సువర్ణభూధరము కేలమున ధరియించియు కృత్తివాసుండు కపాలంబుగొని బిచ్చమెత్తుటేల. మఱియు నీలుబ్ధుండు లక్ష్మీవిభాని యాచించెడి శీతకరుండు సముద్రసూనుడనని చెప్పుటకై యోసఖా కడలిపడతియగు గంగగర్భంబున శివునిశిరంబుగనున్నవాడు. అనిన గృశానుండు. అవును నైన నీలుబ్ధుండు ఫలాకాంక్షులచే గోరబడదగినవాడుకాడుసుమీ. సూక్ష్మసితాంశుకలాభూషుడును, హైమధరపదనివిష్టుండును, అపటుండునునైనను యీలుబ్ధుండు యోమయహస్తుండై దండులనత్వమున్నను, భిక్షుకుబోవుచున్నాడు. చూడుము. ముక్తాశ్రితయు, విష్ణుపదోద్భవయు, గాంగేయప్రకృష్టసూత్పాదనీయునగు గంగరత్నాకర

కడు వడమట నుండిరి. ఒకడు వినాయకునధఃకరించె. మరొకడు షరస్కరించికొనియె. ఒకడష్టమూర్తి, రెండవవాడనష్టమూర్తి, ఒకడగజాతి వరించె. ఇంకొకడగజాతి వరించె. ప్రకృష్టమంగళ నిరువురుదేవులుండిరి.

అట్లు వారిచరిత్రంబును విరుద్ధంబె. ఒకడు ధ్వజరాజునధఃకరించి నొకడుశిరంబున నెక్కించికొనియె ఒకడాకాశగంగను బదంబులదాల్చె నొకడు శిరంబున బెట్టె. మఱియు నీకాంచియందుండు ప్రాగ్దేవత హిరణ్యగర్భమహోత్సవనిరతుండు గ్రించె. ప్రోచె. గజముంగొట్టె. గజములగాచె. ఇవి యీహస్తిగిరి పూర్వోత్తరదిశల జూడందగు దరానుషంగులును గదానుషంగులునగు జనులు తన్నివారణకై హరినాశ్రయించి హస్తిగిరియందుండి తదనుగ్రహంబున దేహక్షయంబునొంది దరానుషంగులును గదానుషంగులునగుదురు. విశ్వావసుడు మిత్రమా యట్లనకుము. కాంచియందేదేవునాపదైవమెకలదు. అదిఫణిపతిసరస్ఫురత్సితసాయక ధరోత్తమాంగశోభితుండై యుండె. అతడె పూర్వాపరదిశలనుండె. ఓహో యేమినాకపవేళిమభాగధేయముదొరికెను. దేవతాయువతీగీతుండయి ప్రొద్దుట పద్మాసనుడును మునిధ్యాతుండై పాండవదూతకన్నులకగపడెనే. కృశానుడు తగనిపనిచేసిన యితనినేల వినుతించెదు దానుజగంబులకెల్ల నీశ్వరుండయ్యు భాగ్యహీనులగు పాండవులకు దూతయయ్యె. వెలుగులఱేడు మిడుగురుపురుగులపిల్లలయింటనున్నట్లు దాసులకుదాసుడయ్యె. ఇది గొప్పవారికింపగునా. విశ్వావసువు వినుమోయీ పురోభాగీ కళ్యాణగుణాకరుడగు భగవంతుని దూఱెదవు. కవిత్వమునకు గాంభీర్యమును సంపదకు దానమును, ప్రభువునకు శౌర్యమును, గురువునకు విద్యయు, సత్కులప్రసూతునకు సదాచారపూర్తియు, మహాత్మునకు సౌలభ్యమును భూషణంబులు, అని విమానంబుసాగించి, వికసించినతెల్లదామరలసొబగును నిరసించు లోచనములుగల విజయరాఘవులీగృధ్రసరస్తీరంబున విరాజిల్లుచున్నవాడు. ఇయ్యదిజటాయుతీర్థంబసంబరశిఖ గృధ్రసరోవరపరిసరంబున బెరిగిన పారిజాతము. ఇయ్యదిశాఖాశతికు

పరిభాగంబుననొప్పు సుమనస్సంచయంబు క్రిందనుండు. మఱియు మిగుల
బత్తిగలిగి జనులనుద్దేశించి భుక్తిముక్తులంగోరు జనులారా యిటువినుఁ
డు. హేతుడగు గృధ్రరాజును సంస్కరించిన వీరుండును, ఆశ్రితవాత్స
ల్యుండునగు విజయరాఘవునమస్కరింపుడు. ఇక్కడనొక్క యక్కజం
బుగలదు. వంధ్యలు బిడ్డలంగోరి యీవిజయరాఘవుం బ్రార్థించెదరేని
యుడికినపెసలును సరసిజనేత్రుప్రభావంబున సంకురించు తోడనే వారల
కును బాలకరించు కృశానువు నిజసూనమహిమకు ననుసూనస్థితిగల
విజయరాఘవునేలవినుతించెదవు. శుకస్తుతుడు, హంసమయూరవాహము
ఖస్తుతుడు క్షీరసముద్రతీరవాసంబుగలవాడును గరుడాసనుండునయ్యె
గృధ్రసరస్తీరంబుననున్నవాడు. విశ్వావసువు, అదిదయాసముద్రుడగు
నితనికి భూషణమేసుమీ. తమఃపారంబును. అస్తామయంబును, నిత్య
సూరిస్తుత్యంబునునగు ఉత్తమపదంబుననున్నను భక్తానుగ్రహ కారణం
బున నరుల నేత్రానందంబుకొఱకిట్లు సాన్నిధ్యంబుచేసె.

అని దక్షిణంబుగ విమానంబు వోనిచ్చి హర్షంబున, ఇదియె గం
గ, సింధువు, సరస్వతి, భవనాశిని, తుంగ, కాళింది, కావేరి, పాపవి
మోచని శోకధారల శమింపజేయునది. సజ్జనులిందు క్రుంకులిడుదురు.
మూర్ఖులకైనను జ్ఞానోదయంబగు. అట్టిపాలేఱు మునిగినమనుజుల దు
రితము లడచెడు నీదుగ్ధనది నాపాపంబుల బోగొట్టుగాక బుధులునుతింతు
రు. తనుతాపమార్చును. కృశానువు అవునైనవిధిచే నీరసయయ్యెఁజూ
మీ లేశము కాలుష్యములేకున్నను మధురయయ్యును సముద్రసంగంబు
గలదయ్యె. విశ్వావసువు. గుణమును దోషముగజెప్పెదవు. సముద్రసం
గంబున బవిత్రయయ్యె. అట్టిజలంబులస్నానపానాదిసంబంధంబడంగు. జ్ఞా
నంబొదవు. అనియిట్లుబుధులు తలచెదరు. మఱియుదక్షిణంబుగబోయి,
యీబాహానదియందు నవగాహంబొనరించిరేని మోహంబులునశింపం
జేసి మంచిబుద్ధిని కలిగించి పాపంబులులయంబునొందించి యొడ్డునగాపు
రమున్న జనులకు శుభంబులొసంగు. దీనియుత్తరంబున శుద్ధశ్రోత్రియు
లకు నివాసయోగ్యంబగుగుణంబుల నొప్పునీయగ్రహారంబుగన్పట్టెను

పికములకింపుగ బాడు రోలంబనికురుంబంబులంగల యీపాపనదీ తీరత
రుజని తమరందతుందిల జలంబులంగలకృత్రిమకుల్యలనొప్పుచు నాత్రే
య గోత్రోద్భవులగు ధార్మికసమూహ క్షేత్రంబై యనవరతసవనహవిర్గం
ధబంధురంబైనయురశాఖిపాలంబును నగ్రహారంబు విలసిల్లుసాధ్యాగ్రహర
యూపేతంబును రఘునాథ రక్షితంబునై యీపురంబు సాకేతంబురీతి
నొప్పుచున్నయది. మఱియు రెండు నదుల తీరంబులాలోకించి చారుగు
ణంబుల సన్మార్గయుక్తములై యీయగ్రహారంబులు ధరణికిని దగ్రహా
రంబులబోలె వెలిగెడు కృశానుడు. సువృత్తముక్తారహితులై యిదం
డు జనులు యీపురంబుల నగ్రహారంబులని యెట్లందురు. విశ్వావసువు
సఖుడాసీవృనిందయని వీనినిస్తుతిన చేయుచుంటివి. సంతసించితిమిత్రమా
యీమండీరమండలంబు సొబగును. మనోజ్ఞతను జూడుము. యీనదీతీ
రంబున నగ్రహారంబులును బ్రత్యగ్రహారంబున నుత్తమబ్రాహ్మణవర్గం
బును, బ్రతివర్గంబున యజ్ఞంబును బ్రతియజ్ఞంబున స్తోత్రశస్త్రాది శ్రవ
ణంబును దనరుచుండు.సుధానిధి డిండీరఖండ యశోమండనులగు పండి
తులుగల తుండీరమండలంబుపావనంబైనయది ఇదియలిగీతమైనది.

ఇదిపాపహారంబగు నదియని యందఱు తలంతురుగాదె. కృశా
నువు పాపభూయిష్ఠంబగు నీకలియుగంబున సద్వాకర్మ నాచరించు వీర
లుచరితలు కోవిదుల కెల్లనమ్మంగలుగు. ఋత్విక్సంపత్తి లేదు. యజ్ఞక
ర్తలు కుశలురుగారు. దోషరహితులుగారు. విశుద్ధద్రవ్యం బలభ్యంబు
హృదయశుద్ధిలేదు. అల్పధనులు కృపణులు సోమయాజినిగావలె. దీక్షి
తుడను గావలెనని కోరుచుందురు. ఊరకపశువధంబు చేయుదురు. మఱి
యునిట్టివిప్రులు యథావిధి శౌచమొనర్పజాలరు. ఆచమన స్నానంబు
లునుచ్ఛరింపనైన జాలరు. హోమంబెక్కడ, అనుష్ఠానమెక్కడ, య
జ్ఞంబులెక్కడ, విశ్వావసువు.మిత్రుడానీవుస్థూలబుద్ధింగొనిమృషావాద
ములాడుచున్నావు. శిష్టులవలన విత్తంబు గొని విద్యలభ్యసించివిద్వాం
సులగు ఋత్విజులవరించి భగవత్ప్రీతిగ నంతర్ముఖులు సంతతము యజ్ఞం
బులొనరింతురు. భగవదారాధనకు స్వర్గంబగు ద్రవ్యంబులేదని యజ్ఞం

బలులుమానువారలు గారు. కేవలస్వాతంత్ర్యంబు భగవత్స్వాతంత్ర్యంబుగాదు.
కావునశక్తి కొలది శుచిద్రవ్యంబు సంచి భగవత్కైంకర్యంబునర్పింపవగు
యజ్ఞంబుచేయలేకున్న యాభగవదారాధనంబు తనశక్తి కొలది చేసినేనియు
దియుయజ్ఞంబగు. హింసవలన పాపంబుగలుగు. యజ్ఞంబున పశుహింస
పాపంబుగాదు. కనుక వైదికులు యజ్ఞంబున పశుహింసకు నిందితులుగా
రు రామానుజగురుండును యాగంబున పశువిశసనంబున ఘంబుగాదని
యె. ఇదిగాకనునాను గురుద్వేషిగాను. హింసాంతరంబులంబోలెయజ్ఞం
బునను బశువధంబు పాపంబని బౌద్ధులతలతురు. అదినిజమగునేని పర
స్త్రీల యందునతనే తనధర్మపత్నియందును సంతానంబుగనుట పాపం
బెయగు. ఇంకొకటివలియుము, ఋత్విగాదులయందు శుద్ధిలేదని యజ్ఞం
బులు మానిరి. ఆచార్యులయందు శుచిత్వము లేదని, చక్రాంకనమంత్ర
గ్రహణాదులు మానినారా. కొందరుభాగవతాభాసిద్ధులై వేదశాస్త్ర
పురాణస్మృతీతిహాసాది సమ్మతములైన క్రియలను శిష్టాచారాంగీకృ
తములైనను చేయక తమయుకల్పించుకొన్న దుష్కృత్యములై చేయుదురు.
అహహా తాడెక్కోతి పనుమ్మో వెలిచినట్లు వీరుయజ్ఞంబులంజేయు వారిని
గూడశిక్షింతురు. ఇంతేలపశుహింసనంబున బాపంబుగలుగునని వెరచె
డు వైష్ణవులు చక్రాంకనంబును విడువదగు. యోలయనిన, భగవత్ప్రీతి
కరంబును, సకలమతసమ్మతమునగు యజ్ఞముకంటె శిష్యులకు దాపక
రంబగు చక్రాంకనంబుఫలవిరహితమైనది. కొంచెములాభముకలిగినను,
జారచోర కిరాతులవలన గలుగును. చక్రాంకనంబు చేయించుకొనుట
కందరునొప్పరు. కృశానుడు సర్వ ఓపుణ్యాత్ముండా. కాలినశంఖచక్రము
ల నంనభుజములు గాల్చుట యజ్ఞంబుల పశువులహింసించుట తోబోల్ప
దగదాయనిన విశ్వాసముండినట్లుసియె. ఓహో గుణదోష తారతమ్యమె
గగనివాడా వినుము. వేయిమేకలజంపుటకన్న నొక్కవిప్రుని గాల్చుట
పెద్దది. కాబట్టి తప్తచక్రాంకనంబు శాస్త్రసిద్ధమయ్యేనేని వేదసిద్ధంబుల
గు యజ్ఞంబులీచక్రాంకనంబులోదలంబులుచేయదగవె. అనేకశ్రుతి ప్ర
మాణంబులచే యజ్ఞంబులంబశువిశసనంబు ముఖ్యంబని సిద్ధించుచుండ

నీతోవాదించుట చేతిలోని రేగుపండున్నదని వాదించునట్లున్నది. ఏలవ్య ర్థవాదము. అనివిమానము నవలకుబోనిచ్చి శిరంబుకంపించుచు రమణీ మణీ మంజులమంజీర శింజితరంజితంబును, సుందరానురక్త యువజనగ ణంబునుగలిగి సంజీవనంబునొందిన కందర్పుండిందున్నవాడనందగి చెంజి పురంబొప్పుచున్నయది. ఇచ్చట వేదవేదాంత, వేదాంగస్మృతీతిహాస పురాణ తర్క మీమాంసాది సమస్తవిద్యావైశద్యంబునంబూర్ణులగు బ్రాహ్మణోత్తములుగలరు. ఇన్నగరంబున గరమ్యప్రాకారాదిసాధనం బులంబట్టిమూడ రాజభటులు యుద్ధంబులంజేసి శిరంబులుదెగి రక్తంబు గారి విప్రపలాబ్ధిపొంద్రింబై యుండునదిగాన నొప్పదయ్యె. విశ్వావసువు. వయస్యా గుణాలవాలమగు నీపురనిందారూపంబున బ్రశంసయే చేయు చున్నావు. కృశానువు. పురాతనపురాంతరంబుల బరిపాలించిన నర పాలురు యుద్ధమునప్రరంతమునందియు నీపురము ననేకాపురముంజేయ గోరుదురేమివింత. అని నిరూపించి పెరపునొంది, యిప్పటివారికేమి, బూర్వపువారికేమి రాజులకు ఇట్టి యవివేకముగలదది యనివార్యముగ దా. ఏమనవినుము. గొప్పధనముకలిగినను, ఊర్జితంబగు రాజ్యమున్న ను, శృంగారాంగనలున్నను, సేనలతోవచ్చి శత్రురాజ్యముగొనజూచి రాజులు యుద్ధంబులజేస్తురు. విశ్వావసువు, విరుద్ధబుద్ధీ యిదివివేకమే. సంపదవార్షికతుక్యవంటిది. ప్రభుత్వము మెఱుపుంబోలునది. స్త్రీలస్థిర యౌవనలు. చమురులేని దీపమువంటివి శరీరములు. కావున రాజులు జ్ఞానంబునొంది నాకలోకంబుచేకొన యుద్ధానలంబున దమశరీరంబులువే ల్తురు. ఈచమత్కారంబువినుము. భటుండుయుద్ధంబునగాయంబునొంది రక్తంబు ముఖంబున గలుగ నప్సరయు ననురక్తముఖియగు, భటుండత ను సాయకఖండితాంగుడయ్యెనేని యదియు ఖండితాంగియగు మృతుం డగు వీరుండు యుద్ధానలంబునంబడుటంజేసి యుజ్జ్వలశరీరుండై, దివ్య విమానంబెక్కి, చేతులజేజేనాతి కుచంబులంబట్టికొని, దానిచే జేయబ డిన నఖక్షతంబులుగలిగి, విప్రభంబునుభూమింగవుంగిలించికొన్నదియు, కృపాణంబుపాణింగలదియు శత్రురాజులచే జేయబడిన గాయములు గ

దుచు స్తోత్రప్రియుఁడగాఁడె. రంగపురంబట్టి కమలాలంకృతంబై యాయతంబై యొప్పుచు తమోనివారకంబగు కావేరీప్రవాహంబు వినుతించెద. సకలకుజన కలుషహరణ బద్ధకంకణయు, నిజతీరస్థిత సాంద్రతమసాలరసాల హింతాలతాళవకుళపుంప చందనమందార కదంబకదంబకజంబూసంపూర్ణయు. పర్ణకుసుమ పలాశసమృద్ధ కపిత్థలోధ్ర నీరంధ్రపాటలపటల జటిలక్రముక ప్రముఖ విశంకట విటపిమంజరీపుంజంబుల వహించి శ్రమశమ కరమకరంద రసగ్రసనేచ్ఛంబును భ్రమరసముదయనిభ్రమంబునం గళింక తనయ ననుకరింపుచు

భవశోషకరియు, భవశోషితయు, సువర్తయు, దుర్వర్ణసుచిఫేనసంబున ససహ్యాసుతయగు గంగనుసగియెడు కవేరకన్య........మఱియు నత్యంత భక్తిగలిగి ''ఈకావేరికాంతుఁడు స్వర్ణసంతుండు. కావేరీహేమాపగ వీరిదాంపత్యమును చూడమె యొప్పెడిని'' కృశానుఁడాక్షేపించి ''పరిశోభి తామ్రపార్శ్వయు మధ్యమున రంగరాజ తస్ఫురితయు నగు నియ్యది యెట్లుహేమాపగయగు'' విశ్వావసువు ''నీదూషణయు నీధునికి వినుతియెయయ్యె'' పీతాంబరాలం కృతమధ్యభాగయు కల్హారమాలాకమనీయ వేణియునై సహ్యగిరికుమారి పతిసమీపమునకుఁజనుచున్నది కనుము! ఊర్ధ్వముననున్న పూగుత్తులుగలిగియున్న తిమ్మలై చరులదరినున్న తరువులు తెలుపుగలవలువల దంబుచుట్టినది దాటుటకు జతనంబుసేయు తెనువరుల కరణినున్నవి గంటేసఖుఁడా! ''లోలలోచనా నూత్న కేళీయోగ్య సారంగముఖ్య భూరుహాపూర్ణ గృహారామంబులును, సకలశాస్త్ర పారంగతులగు పండితులును గలిగి యీశ్రీరంగంబెంత విలసిల్లుచున్నది. ''అని చక్కఁగగని యిట్లనె ఆరామవాపికల నివసించి తర్కంబు లుపన్యసించు లీలోద్యానవనంబుల జెంగు కోకిలలు భాష్యంబు పఠియించు, కేళీకా సీలకంఠంబులు మాటికిమాటికి గర్మజ్ఞానకాండంబులు చదివెడు శారికలు కారికలస్ఫైర్యంబుగ పఠియించు నెంతవింత యయ్యెడు. సకలసంగ విముక్తులగు యోగులు ప్రతిదిన మునయంబునం గావేరినిర్మల పవిత్రజలంబుల స్నాతులై కన్నుల పండువుగనుండ లీ

పశువుండై నశియించు, దీపభ్రాంతిం జనిన శలభంబు సులభంబున కాలి పోదె. లోకంబున సమర్థుండగు పురుషుండు విరుద్ధుని వలననైనను పూజింపబడును. గాధిరాజువలని భక్తితత్పరుండగు రామునివలన రంగాధిరాజు పూజనందదె. కువస్తుత్యాగియు సువస్తు సంగ్రహియునగు రాముడు కురంగరాజహర్తయై రంగరాజుం గొలిచె. లబ్ధసురనుతి ఘోషుండును శత్రుస్ఫీత రోషుండును, నిహతవినత దోషుండును, దాస్యాభిలాషుండును, సంపూర్ణతోషుండును నిర్మల పూర్ణమాధవళ వర్ణుండునగు శేషునియందు నిద్రించుచున్నావు పరమపురుషా.

శ్రీరంగచంద్ర నీసన్నిధిని భాషించుటకును భయపడుచున్నామే లు వ్యాకరణకర్తలు సూర్యచంద్రులక్షులు వ్యాకరణభాష్యకర్త శేషుడు. వేదమయుండు ద్విజరాజు గరుడుండు వాహనంబు నీకోడలు భారతి. ఇట్టి నీగోష్ఠియందు కవి యెట్లు మాటాడగలడు. కళ్యాణ గుణగణవేషముండును, నీలమేఘశ్యామ ధాముండును నిరంతర స్తుతికృతసురరాముండును, పరిహృత భవధాముండును భాసితా కల్పహేముండునగు రంగధాముండు మాకు శుభంబులిచ్చుగాక. జగదీశ్వరియు, నీలాబ్జంబుల నిరసించు లోచనంబులు గలదియు, రూపంబు ధరించిన కాంతివలెను న్నదియునగు శ్రీరంగనాయకికి నమస్కరించెద. తల్లీలక్ష్మి నీవుమోహోన్మూలనంబునకు సిద్ధౌషధంబవు. సంసారులకు మోక్షమిచ్చు నిశ్శ్రేణివి యరిషడ్వర్గంబు జయింప సిద్ధగుళికవు. చింతాతమంబునకు చంద్రికవు. విద్యానిలయవు, విష్ణుహృదయంబున హేమమాలవు నాకు కోరికలీయ పారిజాతలతికవు. బ్రహ్మానంద సింధువునకు తరంగమవుసుమీ. కాంతిని హరించువృత్తిగలదై యతిచంచలయగు కమలను అశిష్టుండైన ప్రేమగలదాని బుధుడు స్తుతించునే, యనిక్రుశానుడనియె. మొదల మణిమయశయ్యల బరుండియు తృణపర్ణ శయ్యలనె గోరును, క్షీరశాల్యన్నంబు దిన్నవాడుక దన్నంబుగోరును. అదియె యమృతముగును, దుకూలంబులు గట్టినవాడు చింకిరిబొంత కాశించును లక్ష్మీకటాక్షము దప్పవేని రక్షకుండు భిక్షుకుండగు దరిద్రుడు ధనికుని గృహా

ద్వారముచేరి వారింపబడును. అట్టివాని ద్వారంబున ప్రాణంబు లుం
డును. భూమియందు శయనించిన యాదరిద్రునియందు భూమినెయునిం
చినది. దరిద్రునిభార్య యాహారములేనిదై మెసలింప హారములుగలద
య్యె. ఇదంతయు లక్ష్మీకటాక్ష లేశఫలంబె. ఇట్టులోక ప్రవృత్తి ని
మ్నోన్నతత్వంబులందుచుండు. ఘనాధనమై యోపాపి మోహముగని బంధుల
జంపుట. పరస్త్రీలంగూడుట, జంతువుల హింసించువారితోగూడి సం
తోషించుట, అయుక్తములు పరుషములగు పలుకులు పలుకుట, కోం
డెమన్నమె వండికొనుట, యిట్టికృత్యములు చేయు మనుష్యులయింట నీ
వున్నత్యమాడుచున్నావు నీవలననే వారట్టివారైరి. పరస్త్రీల జూపనివా
రింజూడవు. పరపీడజేయ జింతింపనివారు నీబంధులుకారు. కల్లలాడని
వాడు చుట్టంబుగాడు. పశుహింస సేయనివాడు నీకు నిష్టుడుగాడు దరి
ద్రులజూడవు. అట్లయిన సంసార నదినెట్లు దరిద్రులు దాటగలరు. సా
ధుజనుల కనుపయుక్తంబులై దుర్జనులయందుండు నీయాభాస సంపద
లు భవతారణకారణయగు లక్ష్మీకటాక్ష విరహంబులేసుమీ. సుగుణ
హానియు లక్ష్మీకటాక్షముననే కలుగునని సురేంద్రుండు పలికియుండె. ఎ
వనిమొదల విష్ణువల్లభయగులక్ష్మి పరాఙ్ముఖియగునో వానిసద్గుణంబులు
మారును. క్షుద్రులకు నన్యాయమార్గంబున సంపాదింపబడిన విత్తం
బు లక్ష్మీకటాక్షమువలన వచ్చినదిగాదు. అదినరకానుభవంబు గలిగిం
చును. తమోగుణ ప్రధానంబగు కించిద్భాగ్యముచే తామే గొప్ప
వారమని గర్వించు దుర్జనులు పెద్దల నవమానింపుచు దుర్బుద్ధులై ధర్మ
మునంద సూయాగ్రస్తులై విటులై యుండు నల్పులు అత్యల్పకాలంబున
నె తమప్రాణంబుల గోల్పోయి కటకటా నరకలోకంబునొంది కల్పప
ర్యంతంబు నరకకూపంబునంబడి దుఃఖింతురే. సజ్జనులకు సంపదలుండవ
నియంటివదియజ్ఞానమూలంబువినుమునిరంతరభగవద్భక్తివలనముక్తిసం
పదగలుగును. అదిగలుగుటకు శ్రీలక్ష్మియొక్క తమోవికారభంజకము
లును సుధాధారా సమానములునునగు కటాక్ష వీక్షణములుసజ్జనుల
కాధారములు. అట్లుకదా. సంపదలు సంభోగారంభంబున మదంబుపో

స్నింభుజంగులచే బరిరంభితులైన కాంతల హారసూత్రంబులు శిథిలంబు లగునట్లు స్థిరంబులుగావు. అట్టిసంపదలకు స్వర్గభోగంబులె తుచ్ఛంబులను సాధువు లిచ్ఛగింపరు. వారికి స్థిరంబున మితంబునగు మోక్షసామ్రాజ్యంబు కలుగును. లక్ష్మీకటాక్షపూరం బెంత మహిమగలది. ఎంతయల్పుడైనను లక్ష్మీకటాక్ష ప్రసారణంబున బ్రసరణ తారతమ్యంబున నరపతియు సురపతియు, పశుపతియు, ప్రజాపతియు నగునుగదా. కృశానువు లక్ష్మీకటాక్షాతిశయమే విభవాతిశయమునకు హేతువుగాదు. కటాక్షలేశమే సంపద నెక్కువిచ్చును వినుము. లక్ష్మియొక్క యుత్కృష్టకరుణా కటాక్షప్రసాదమున నేనరునికి గజాందోళికాశ్వముఖ్య వాహనంబులు గలుగును. లక్ష్మీకటాక్షము లెక్కనగునేని, మేఘము, వృషభము పక్షియు వాహనములగును. ధనంబున మదంబున స్త్రీలోలత్వంబును దానసరకంబులు గలుగునుగాన సజ్జనులు సంపద నపేక్షింపక నిలింపపతినుతయగులక్ష్మిని పరమమగునవని యందు వినుతింతురు. అని యంజలించి ధ్యానించి తల్లీ యెనిమిది నేత్రములుగల బ్రహ్మయు మూడునేత్రములుగల రుద్రుండును, సహస్రనయనుండగు నాఖండలుండును. ఆరునేత్రములుగల కుమారుండును ప్రాతఃకాలమందు వికసించిన పద్మసమూహంబునకు ముష్టాముష్టి యుద్ధంబు గల్పించు భవదీయనయనద్వయంబు దృష్టినెక్షణమైన గోరెదరోహో. అనిదృష్టి కేరొక్కదిక్కని గుడించి సంతోషించి, ఉగ్రులగురువుల నిగ్రహించువాడును శక్రపరాక్రమ మదహంతయునగు గురుడిదయతో గూడిన యాదరణమాకుపూర్ణమై యుండుగాక. కృశానువు "అతిమర్యాదుడగు సువర్ణనేమి వర్ణించెదు అధిగతి నిగమాంగుడును, ద్విజరాజును, అచ్యుతుమోయువాడైనను గరుడుండు భిల్లపల్లి మ్రింగినాడు. విశ్వావసువు. గరుడుడు భిల్లపల్లి దినుటవలన శిష్టరక్షణదాస్య, శిక్షణంబును అందునబట్టి సదసద్వివేచనా సామర్థ్యంబును బయలుపడియె. అతిస్తోత్రంబు దూషించెదేల పను సువర్ణుండు భిల్లపల్లి కనుమ్రింగుచో దనకంఠంబున దగులొక్కన్న విప్రురమానాధభక్తుంగ్రక్క. ఇతాసుగంపను నాపెప్రు

షు కిరాతులతో గలిసియుండెగాన కంఠంబున నెక్కుడనదియె. శాస్త్ర ణుండుగాఁబున మిగులునెడనెయ్యో. ఏమిరా! మీనకేతిరాజు స్వేచ్ఛ చే విహరించునప్పుడును స్వామికైంకర్యము నిశ్చన్నమై యుండును. గరు డుండు నిజనఖజనిత వాతంబునఁ దేఁగ నరిజంబున నదినాపేక్షితహారిరథ నినిముడ లాంతర్వర్తిఁ యగు విష్ణువును సమార్గంబునుగప్పు తద్వాత నే గంబున సంబుధికల్లోలంబు నొందించి తత్తరంగఫేన ఖండంబులను కు సుమంబులం బూజించు శివునిం బూజించునప్పుడు నేననేనయని సంభ్రమిం చు దేవతలకు శివుని భూషణంబులగు పన్నగంబులచే భయంబును బులకలును గలిగి పగలింపుచుండె నీగరుడుండు గనుక నీనేని శ్లాఘ్యంబుగ లుగు. అట్టి నేడమయుండును. బంగరునంటి నగ్నంబుగలవాడు నగుసుప ర్ణుండు నగ్రంబు ఛేదించి రక్షించుగాక. అంగీకృత శాఖుడును సుపర్ణు డు, నుపక్రమునైన గరూడంబున నున్నవాడు తగునిది. పిన్నక్కైకవిధే యుడగు నీతడు చిత్రము మధురిరోధినలన నామోదము నందుచున్నా డు. అనిపట్టణమెల్ల క్షించి యంజలిబద్ధుండై శ్రీరంగస్థల నిత్యవాసు లును, సంసారభయ విరహితులును శిష్యులకు పరమార్థోపదేశంబుచేసి జ్ఞానంబు గలిగించువారునునగు విష్ణుదాసులకు నమస్కృతి కృశానువు నీవీపట్టణవాసులకు నమస్కరింపకుము. అనేక గుణగణాలంకరిష్ణులగు హరిదాసు లీపురంబున గలవారు అన్నవిక్రేతలై యుందురు. శ్రీరం గేశునకు నివేదించిన యన్నంబుద్వార స్థితులగు నింద్రాది దేవతలకు బలియిడుదురు. ఆదిహావియసంబరగు అఘహారంబగు దానిని వీరమ్మె దరు. వీరికి శ్రీదయితుండు వైకుంఠమిచ్చునె ధనాశాపిశునులగు వీరలు జ్ఞానశూన్యులై మూఢులై నిశ్చయంబుగ పరమపదమ్ము నమ్మజాలు దురో గర్వకైన విశ్వావసువు మందమతీ యిట్లనకుమనకు ముకుంద పాదారవింద వందనాభినందితులగు జనులకు నెట్టిపాపంబులైన నశింప వె. దివ్యౌషధంబు సేవించు రోగులకు నపథ్యంబుపద్రవంబు చేయునె. ట్లు. పురమంతయు నిరీక్షించి శ్లాఘించి శైవస్థలంబులుండేని విష్ణుస్థలం బులుండేని రంగముకంటె సప్తప్రాకారములు గలిగిన స్థలంబొకండు

చూడంబడునే. కృశానువు వయస్య యిట్లనను. ఈరంగపురంబునకు సమీపంబునను మరుద్వృధాతీరంబున సప్తప్రాకార వేష్టితంబగు శ్రై నస్థలంబు చూచుచున్నావుగదా. విశ్వావసుండు నవ్వి సత్యము జర్జరప్రాకార సంవృతమని సప్తశబ్ద శ్లేషచే రంగము ధర్మ్యము సమర్థింపబడినది. సంతుష్టుండగు దర్పకగర్వ పరిహారకరణ లోచనవహ్ని సంపన్నల లాటారుణ్యుండును ఫణిగణ భూషణాభీషణుండును కబళిత గరళుండునై వెండికొండనుండు మృడుండు శంఖవర్ణంబై నాకొఱకు కావేరీతీరజంబుకేశ్వరంబున నెల్లప్పుడు విహరించును. కృశానువు చెలీ యిచట విశ్వవిలక్షణరీతి కనుపట్టుచు నుండదగదు. చూడు నదీజలముల స్నానమాడినవారు తాపంబు విడుచుట సాజము అట్లుగాదు. కావేరి శంఖరాభిషేకంబునం దాపంబులిడుచున్నది. విశ్వావసువు ఏల, ఏల యీలాగు కృశానువు యమునా గంగా సంగంబునకుం గావేరి యక్కట యసహ్యత్తాపయై గంగాధరు తనజలంబుల నభిషేకించి తాపంబు వాపె. విశ్వావసువు ఇట్టిదూషణంబు గుణగ్రహణ నిపుణుల కభిమతమెయని యన్యదిశకు విమానంబు నాగించి, యానందంబున పుణ్యంబులగు శైవవైష్ణవక్షేత్రశోభితంబులును, మందపవమాన చలితప్రవాళ సహకారవనంబులునగు చోళభూములివివిలసిలుచున్నవి. చక్కన దిలకించి నాగవల్లీమ తల్లికలచే నాలింగితంబులై కామినీపరిరబ్ధలైన కాముకులంబోలె క్రముకంబు లొప్పుచున్నవి. ఇదిగో చూడుమోయి ఇదిగో చూడు మహాహా కావేరీతీరంబునంబుట్టియభ్రంకషంబులై పెరిగి సూర్యమండలాంతర్వర్తియగు శ్రీమన్నారాయణునకు నూతనోపహారమర్పింప బోవుచున్నవో యనన్నొప్పు నారికడంబులం జూడుము. కృశానువు నాయభిప్రాయంబు వినుము. చలించెడు విశాలపత్రంబులును గొప్పకాయలును, వాయువుచే రేగెడు ధూళిచే గప్పబడినవియునై మిక్కిలి యున్నతంబులైయున్న నారికేళవృక్షంబులు, దీర్ఘంబులు ప్రకాశంబులునగు జడలనుదాల్చి గుడిగుడి (హుక్కా) గలవారును, భస్మలిప్తశరీరులును దిగంబరులునగు గోసాయిలుంబోలె నొప్పెడి విశ్వావసుం

పునస్స్వరూపము విష్ణుగాంగ్య సద్విద్యాకర్ష సముచిత గంధసారవులు
ను. అనసూయాగ్రహారయోగ సంప్రాప్తాధికరేణు సంసర్గములును పున్నా
గులం గనుంగొనుము. ఈజనపదంబుల యాభిజాత్యామహోన్నతం జూ
డుము. ఈచోళదేశంబున ద్విజులు జ్యోతిష్టోమాతిరాత్ర పౌండరీకవా
జపేయంబులు నిత్యంబును చేయుచుందురు. శాస్త్రార్థములను నిర్మా
హ్యాదయులును, స్మృత్యాన్నహోత్రులును, విద్వాంసులును, వేదైకధనులు
నై సంచిత శ్రేష్ఠులు పుణ్యశీలురునైన సజ్జనులు జగంబు పావనంబుచే
యుదురు చూడుము. కృశానువు ఏతద్దేశవిషయంబు మాటిమాటికి
స్తుతింపదగినదే, ఈవిషయంబున వసించు బ్రాహ్మణులు యథాకాలం
బున కావేరినదిం గ్రుంకులిడి సంధ్యాకృత్యంబుదీర్చి హోమంబులు గా
వించి యజ్ఞంబులుచేసి శాస్త్రంబులు నేర్చి పంచదేవతల నర్చించి యతి
థులం బూజింపుచుందురు. కాని వ్యాసితాన్నభోక్తలై దోషంబునొం
దరుసుమీ. మరియు నిరూపించి విస్మయంబున ఇద్దేశంబున వాసంబుచే
యు వింతులకు సిగ్గు కలుగకుండుట కష్టంబు గలిగెడు బహుకాలముగ
చోళవనితలు స్వైర్యంబుగలిగి యునతులైనను రవికల విడిచి సంచరిం
తురు. విషద్ధమయ్యెడిని చోళమహిళలు, కమలనేత్రలు గజకుంభంబు
లంబోలు పయోధరంబుల గప్పరు. లజ్జమనంబుల దలంపరక్కటా విరు
ద్ధముగాదె కులకాంతలకిది మరియు చోళాంగనలు సవాసర్వంబున గృ
హబహిర్భాగంబున గుంపులుగూడి నిశ్శంకంబుగ కామగాథలు చెప్పు
కొనుచు కఠిన స్తన దర్శనంబునని రసరాశియగు మునినైనను మోసపు
చ్చుదురు. నీళ్ళబిందెల మోతచే మూపులు కాయలు గాచినవి. పద
ములు గోమయమలినములైనవి. గడ్డికోతచే చేతులు బిరుసుపాఱిన
వి. ఎండుకట్టెలు లేక మండనిపొయ్యి దండగూర్చుండి వండుటచే క
న్నులు నీళ్ళుగార్చుచుండె. దరిద్రసికోడలై యుండుటట్టి కష్టముగదా
తలవెండ్రుకలకు చముఱురాయరు, కన్నుల కాటుకలిడరు. ముఖముల
తాంబూలరక్తమదోపదు పయోధరంబుల జందనములందరు. చిన్ననగ
గిలైన నొసలబెట్టరు. మంచివలువలు గట్టరు. పూలు ముడవరు పీద

యింటికోసంగ్రదు పాపముహరించును. విశ్వావసువు వయస్యా చోళ
మండల జనుల దూఱకుము. జలంబులచే నిల్లవస్తువులు పరిశుద్ధంబు
లగు నట్టి జలంబులందు భగవన్నివేదితంబగు పదార్థంబుంచి రక్షింతురు
రాత్రి యట్లు రక్షించిన హవిష్యంబు భక్షణార్హంబు. అదిపర్యుషితం
బందువేని, యాజ్య యుక్తంబుగనైన తైలయుక్తంబుగనైనచేసి భుజిం
పంజను నిషేధంబుంబోలె విధికిని శాస్త్రముగలదు. పాతివ్రత్యముగలి
గి సదాచారంబు నాశ్రయించి నిర్మల చిత్తలగు చోళస్త్రీల కుచాచ్ఛా
దనంబు లేమింజేసి దోసంబేమి సురతోపభోగ్యంబులగు నంగంబుల
ప్రకాశంబున దోషంబందువేని యధరంబున కెచటనైన కప్పుటగలదె.
పార్శ్వంబనలోకించి శ్లాఘించి, ఈదేశంబు భాగ్యనంతం బెంతింతయొ.
సకలదేవతా సార్వభౌముండును, సర్వాంతర్యామియునగు విష్ణుని, దు
రితంబుల డంచెడు కుంభఘోణంబున జగన్మంగళప్రదుడై మల్లికాపుం
జసదృశంబగు శేషశయ్యపై యోగనిద్రాసక్తి బరుండు వానినీనగర
జనులు దర్శింతురు. నాగరికజనంబులంజూచి శిరఃకంపంబుసేసి కుంభ
ఘోణంబుననున్న భూభిసురలు కావేరీ జలంబులస్నాతులై శుచులై
జపాది నిత్యకర్మలాచరించి హవిస్సు హోమంబు గావించి వేదంబు పఠి
యించి భవభంజనుండగు కంజనేత్రునకు మ్రొక్కి వినుతించి భక్తులై
భజించి యిట్లు కాలంబు గడుపుదురు. యమునా తీరంబున గోపికలం
గూడి నికుంజంబుల విహరించి గోపాలుండని ప్రసిద్ధికెక్కిన యనంతమ
హిమగల భగవంతుడకంపకారుణ్యుండై చంపకారణ్యంబున భాసిలుచు
న్నవాడు. ఇచట శ్రీరాజగోపాలపదకమలాశ్రయులిట్టులను సంధింతు
రు. కోపముగలిగి పరుషభాషణంబుల సద్ధిజనంబుల గాసింబెట్టెడు రా
జాధముల దలపనేల తాపత్రయాపిష్టులగు జనులు తన్నొక శరణం
బు నొందిరేని వాని తనవానిగా రక్షించెదనని ప్రతినచేసిన మాయా
గోపాలుని పాపంబు వాపం గొలువుము. కృశానువు ఇచ్చట విరుద్ధమే
గలదు. సుమనస్సేషణంబు లన్యస్తపాదంబై మధుహర్యై ముశారా
తిద్వారేభ్యైనను చంపకారణ్యా మాశ్రయించినాడు చిత్రమయ్యె.

విశ్వావసువు! విరోధులకైనను సహవాసస్థాన సంపాదకుండును దేవుండనగు వాసుదేవునెడల విరోధకథాప్రసంగమేల. తేజస్విలును బుద్ధిమంతులునై సూర్యచంద్రులు నేత్రంబులై యుండియు తేజస్విలును ముదితులునై శయ్యావాహనరూపంబుల శేషశేషాశనులును శ్రీరాజగోపాలుంగొలువరే. ఇచట లేశమాత్రంబయిన విరోధంబుగలదె. అంతట సహకారతరువులుంగలిగి యున్నతంబులగు నారికేళవృక్షంబులచే రమ్యంబులై యందుచే రవికిరణప్రసారణంబున కనువుగాక యొప్పుచు దురితహరంబులై యొప్పు చోళమండల దివ్యస్థలంబులకిదె నమస్కరించెద. కృశానువు ఈదేవలకాది దేవాలయోపజీవులం జూడదురాచారులు వీరలకు నమస్కరింప నాకుమనసొప్పదు. వారనారీపయోధరంబుల మర్దించుకరంబుల నర్ఘ్యాదులర్పింతురు. తత్తాంబూల రసవాసనలుగల ముఖంబుల మంత్రంబులుచ్చరింతురు. పాపంబునకు వెరవక దేవద్రవ్యంబు హరింతురట్టి యర్చకులచే నర్పింపంబడు నీయర్చావిగ్రహంబులయందా యాదేవతలెట్లు సాన్నిధ్యంబు జేయుదురు. కటకటా పాచకులు సంధ్యాదికర్మ లెట్టివో యెఱుగరు. వేదాక్షరమెన్నడు నెఱుగరు. పణ్యవధూకథలు తెలియుదురు. ధూర్తవచనంబు లాదరింతురు. అన్నంబు దొంగిలుదురు. దుష్కులంబులబుట్టిన వీరిచే పాకంబుచేయబడిన పదార్థంబులు దేవుండంగీకరించుచున్నాడో హా అనివిమర్శించి యేమివిరతి యొయ్యడు కలిమహిమవలన నఖిలజనులకు వివేకము నశింపుచున్నది. ఇండ్లకడ శుద్ధంబులై సిద్ధపఱుపబడి హరికర్పింపబడినయన్నాదులం బెద్దలంగీకరింపరు. వ్రాత్యులువండినవియు సందఱు చూచినవియు దురాచారులుతెచ్చినవియగు నన్నాదులు దేవాలయంబులం బెద్దలుగూడ నిరభ్యంతరంబుగ భుజింతురు. విశ్వావసుడు. ఈదివ్యక్షేత్రమాహాత్మ్యంబెఱింగిన మాబోంట్లకు నీమృషాదూషణంబు రుచింపదు. ప్రభాతంబున సుస్నాతులై శుచులై పవిత్రరూపులై తత్తన్మతగ్రంథంబు లభ్యసించి కలుషంబులడంచి యర్చకులపవిత్రులై విధ్యుక్తంబుగ భగవంతుని కన్నాద్యులు నివేదింతురు. అదిలోకపవిత్రాణంబు నీదూషణ మంగీకరించినను నో

క్కటి చెప్పెదనువినుము. ఇక్కడనుండు నర్చకాదులుశుచులై యుండి నశుచులైయుండె, భక్తిచే నొండెలేకయుండె, విధివంతంబుగనొండె, కాకయుండె ప్రతిదినము భగవంతునర్చింతురు. ఈదేవుల దేవతలు నర్చింపుచుందురు కావున నాస్తికులకు దేవుడని జ్ఞానముగలదు. కొందఱు భగవదపచారభీతులయ్యు, గొందఱు రాజదండనభీతులయ్యు, పాచకులు శుచిత్వముతోఁగూడి యేభగవన్నివేద్య పదార్థంబులం బక్వంబు గావింతురు. అట్టి పక్వపదార్థంబు స్వామిసన్నిధినుంతురత డదిప్రీతుండై యారగించుచుండు భగవత్ప్రసాదంబు పాపహారంబని భుజింతురు. అట్టివారు పుణ్యాత్ములు భగవదాలయని వేదితాన్నంబునకును తదితరస్థల సిద్ధాన్నంబునకునుగల భేదంబనుభవ సిద్ధంబువినుము. బహువ్యంజనంబులతోడను, బహురసములతోడంగూడి రుచిగలిగి శుచిత్వంబున గల్పింపంబడిన యన్నాద్యంబు శిష్టులయిండ్లయందైనను బెద్దలుగొన నొల్లరు. ఇట్లనేకవ్యంజనంబులు పలురసంబులు లేకున్నను దేవాలయసంబంధియగు నన్నంబు భోగ్యత్వంబుగలిగి యఘహారంబై యుండు. దేవాలయసంబంధి పరిచారకాదులు దురాచారులైనను సదాచారులైనను స్వామిపరిగ్రహీతత్వముంబట్టి పూజ్యులెయగుదురు. రాజాశ్రయ గౌరవంబున గుజ్జక్కిబాదులు పూజ్యులైరికదా. అని యెదుట గనుంగొని యంజలిగావించి హర్షంబున పాతకుల రక్షింపను, లవణసముద్రంబు నశింపజేయను. లంకజేరను, రావణాదుల జయింపను, సీతను దోడితేరను కీర్తివృద్ధినొందింపను సుఖము గలుగుటకును శ్రీరామచంద్రుడు నిర్మించిన సేతువునకు వందనంబాచరించెద. కఠినంబులగు నలసేతుశైలంబులకు సంబంధిజనుల నెంతప్రీతియయ్యెడు. ఇదివింతయయ్యె లంకాపురంబున శక్తిముఖుండు నిరోధించియుంచిన భూమిసుతను భూమీశుంజేర్ప తాము భూమీధ్రంబులగుట సముద్రంబున నలునిచే నిల్పబడిన శైలంబులు దేలుచున్నవి. నలునిచే సేతువుకై సముద్రంబున వేయంబడిన భూధరంబులు దేలుచు తరంగ వేగంబుననంటిన ఫేనంబుగలిగి మందరగిరి సుధారాశిలో మునిగిపోయెనే యనినగియెడు, లంకాపు

రాక్షసనాథుండగు రావణు సంబంధదోషంబున నంబుధినాథుండు సపక్ష భూభృన్నిబిడాంతరుండయ్యు విపక్షభూభృత్తులచే బంధనంబు నొందినాడు. కష్టమేశుద్ధులై సంశ్రితధర్మసేతువులై వర్షాతపంబులకోర్చి సముద్రజలంబులలోమునింగి యీభూభృత్తులు ఘోరతపంబుచేయుచున్నారు. తీర్థాతన్వాశుగంబుల లావణ్యంబు నొంది నిత్యము నృత్యంబాడుచునుండు వీచీచపలలంజూచియు నీవుచలనంబు నొందవు అని క్షణమాత్రంబుధ్యానింపుచు నంజలిబంధించి మహాగర్వియయ్యు నెవ్వనికివెరచి మహాశిలాబద్ధసేతుండయ్యెనట్టి శ్రీరామచంద్రా లోకంబుల పాపంబులు పోగొట్టి రక్షించుస్వామీ నీకోపంబునకొక నమస్కారము. కృశానువాక్షేపించి శ్రీరాముడు తనరోషంబునకు వెరచిన సముద్రుని దుర్భరశైలంబులచే బంధించి వానరులను దాటించినాడు సేతువుగట్టి శ్రీమనోందనేల సాగరజలంబులం గపులనడిపింప లేకపోయెనా. విశ్వావసుడు నేను జెప్పినాను నీవువిన్నగా వినలేదు మరల జెప్పెదను. చక్కగావిను, వానరులు సముద్రము దాటగలరు.

అదినెపంబుగ మానవులు పాపరాశిందాటుటకు శ్రీరఘువీరుండు సముద్రంబున సేతువు గట్టించినాడు. మఱియు నిరూపించి ఇది సముద్రంబుగాదు. నభంబు ఇదిఫేనంబుగాదు. స్థూలతారకావర్గంబు, ఇది సేతువుగాదు రాక్షసులకును మనుష్యకలుషంబులకును ధూమకేతువు. నలుడు నిర్మించిన సేతువునందలి పర్వతంబులంజూచి గజంబుల నిభ్రమించి మొసళ్ళుకోఱలచే రాలంగొట్టికి నొప్పియెత్తివచ్చిన దారినేపరుగులిడుచున్నవి గంటుజలచరంబుల చేష్టలు. డిండీరఖండ సంపర్కంబునం బాండురంబై నిడివియు వెడలుపుగలిగి రాముని సేతువు సముద్రుని కుత్తరీయంబై యొప్పుచున్నది. చిరకాలంబుగ భూమిమోయుటచే నలసి శేషుండు తద్భరంబు దిక్కరులపై బెట్టిశ్రమాపనోదనార్థంబు సేతురూపంబున శీతలసముద్రజలంబుల పరుండియుండెనా. అని శ్లాఘించితోల్లిపాపదశకభంజన సాధనంబు సేతువు పంచపాతక భంజనంబు చేయజాలదె. అనిమోదంబున వెనుకకు మరలి నొండొకడెస బరికించి, తీర్థం

బుల హాసంబున నొప్పు మహార్ఘ శంఖంబులంగలిగి ముల్లోకంబులం బ్రసిద్ధయై సముద్రగామినియై తామ్రపర్ణి యనునీనది జనులభవదావానలతాపంబు వాపుచు నొప్పెడు. అట్టి తామ్రపర్ణీతీరంబున ధృఢవ్రతుడువ కుశాగ్రహారణును గోవకుళ మాల్యామోదంబునకు మోదంబున నేగెడు తుమ్మెదల ఝంకారంబునకు ద్విగుణంబగు ద్రవిడప్రబంధాను సంధాన ధ్యానంబుగలిగి వైరాగ్యనిధులై షడ్గుణ పరిపూర్ణులగు శ్రీమన్నారాయణభక్తిం గొలిచెడు వైష్ణవులచే వెలుఁగొందెడు కురుకాపురి. పరమహితంబగు ద్రావిడవేదంబును నాలుగువేదంబుల సారంబును నాలుగు భాగంబులుగ మాకుబ్రసాదించిన యుపకారియగు శఠకోపమహాయోగికి నమస్కరించెదము మామకతపఃఫలంబై యవతరించిన శఠారి యనుయోగి పర్యాసనంబునంగలిగి కల్పతరుపంచకంబుం దిరస్కరింపుచు నింపుగనున్న చింతావృక్షంబుంగొని యాడెదము.

ఏతరుమూలంబున నాశ్రితుల కమృతఫలంబులు గలుగుచుండె నట్టి తింత్రిణీతరుమూలంబున నాశ్రయించి భక్తులకు ననేకశాఖలుగల ద్రావిడవేదంబ నుగ్రహించెడి శఠజిద్యోగి విరాజిల్లుచుండె. హరియె శఠారియై యవతరించె. కావున శఠజిద్యోగిని శరణంబందెదము. ముముక్షువులతనిం ధ్యానింపందగు. అతని దివ్యప్రబంధంబె గానంబు సేయందగు. ఎవ్వని దివ్యద్రావిడ ప్రబంధంబులుం బాడి మనుష్యులు దేహంబులువిడిచి యుత్తమపదంబున, అహమన్నాదఅహమన్నాదో. యనిప్రసిద్ధిగాంతురట్టి వకుళమాలాధర యోగికి వందనంబు పాపంబులం బాపి వేదాంతార్థంబుదెలిపి రమానాథునవశంబు చేసిన శఠవైరిగాథలకును ధయుసాటియగునె. అనిజనులనుద్దేశించి ఓజనులారా మీరాయుదరపోషణార్థమై కతనులును శత్రులునగు నృపాలకుల స్తుతింపకుడు గాఢతమంబగు సంసారకూపంబునంబడి పొరలకుడు. అనాయాసముక్తిదంబులగు శఠారాతిసూక్తులంబఠింపుడు. అనిక్రోశానుంజూచి, ఓయువిమలమతీ నీకు మేలుచేకురు కురుకాపురి క్షాపురముగాగల శఠకోపికోపికతోనతిచేయుము. షట్జనభరణీయంబులగు నకుళాభరణీయంబులగు ద్రావిడవేదంబులం వై

ష్ణవాలయంబుల దారస్వరంబుల గీతికాంచుపుణ్యాలు లోకంబులం బావ నంబునొందింతురు. వైరాగ్యంబునకు నెలవు. భక్తికిరంగస్థలంబు, ముక్తికినిచ్చిన,పుణ్యాతరుక్షేత్రకస్థలంబు, శరణాగతికుద్యానభూమి, యపౌరుషేయంబగు వేదంబునకు ప్రియసఖి, చిదంబరక్షేత్రంబు నై వకుళ యోగినిగమంబు నెగడుచున్నది.

“ అని యంతటంగాయంగనుంగొని కృశానునుద్దేశించి ” తత్వ మెఱుంగంగోరి యుపనిషద్రహస్యంబులగు ద్రావిడవేదంబులం బఠియించి కురుకాపురింగాపురమునందు శ్రీవైష్ణవసజ్జన బృందంబునకుం బల్మరు నేల్మోడ్పును. కృశానువు సత్యమైన నతరాత్రిస్మృతులు కొన్నియుచట వాడుట కలదట. దానమానసీయగాడనిలాలచెద. ఏమన్న వేదోక్త మార్గంబతిక్రమించి యిచటియతులు వర్తింతురెట్లన్న త్రిషవణస్నానంబులేదు. కమండలువుద్వాప్పరు. చాతుర్మాస్యవ్రతాదులు లేవు. భిక్షాటనంబులేదు కామంబులువర్జింపరు. ఉపనిషత్తులుపఠింపరు. వీరెట్టియతులవుదురు. మఱియుసర్వసంగంబుపరిత్యజించినన్యాసియయ్యుభగవత్కైంకర్యమనిపేరుపెట్టుకొని యాశాబద్ధుడయి రాజులనాశ్రయించి పురంబులుచొచ్చి యర్థంబార్జించు మదంబునందకమ్మగనెల్ల పదార్థంబులు తిను. రామరామ యిట్టియతిచేష్టలకెవ్వడు సహింపగలడు. వేయేల కలియుగములో గృహస్థులైన వైష్ణవులకు యతులైన వైష్ణవులు నమస్కరింతురు. ఇదెక్కడివిపరీతము. మఱియు (సాతానికి) విష్ణుభక్తుడగు శూద్రునికి వైష్ణవుడగు బ్రాహ్మణుడు నమస్కరించు. వీడు మూఢుండుగాడె. ఈక్రమంబక్రమంబ. ఇట్లుకురుకాపురిలో జరుగుట మనంబునఅరుటగాదె. విశ్వావసువు. సఖా యిట్లనకుము. ఈయతులలోగొందఱు స్నానసంధ్యాదివిధులు విడుతురు చేయుదురు. భిక్షాచర్య చేయుదురు. విడుతురు. శ్రీహరిచరణసరసీరుహకింకరతారతులు గావున నార వారికెట్లునిర్మలహృదయులకు పాపప్రసక్తి. ఫణివర్య పర్యంక కైంకర్యార్థంబు యతులు పర్యటనంబుచేయుట నుచితమంటివది దూరాలోచనలేకచెప్పితివి. పంకజనయన కైంకర్యార్థంబు రాజధానికిం

బోవు యతులు స్వార్థంబుధనాశచే బోరు కావున ధన్యులెసుమ్ము. ఇట్లు హూహాదేయపిదులుదాహరింతురుగాదె. స్త్రీలవివాహమాడుటసంభోగమునకాకాదు. సంతతికొఱకు యజ్ఞంబొనర్చుట ఖ్యాతికాకాదు. స్వర్గమునకు. పాకంబుచేయుట తనకొఱకా, కాదతిథిపూజకు ధనమార్జించుట యపాత్రులకిచ్చుటకా కాదు. ధర్మముకొఱకునధ్యయనంబు ప్రతిగ్రహంబుకొఱకాకాదు. బ్రహ్మప్రాప్తికొఱకువాదమునకా శాస్త్రాభ్యాసముకాదు. జ్ఞానముకొఱకు కావున వాసుదేవసేవయునట్టిదె. బహుపాపియయ్యుభగవద్భక్తిహృద్యుడగునేని పూరుషునిసజ్జనులు పూజింతురు. సర్పంబులుచుట్టుకొన్నను తీక్ష్ణకంటకంబులుగలదైనంబరిమళముగలపూలుగలకేతుకి భాగ్యభాగులకు పూజార్హగాదె. అని వేఱొక్కదిక్కుదృక్కునిగుడించి యంజలించి వేదోక్తకర్మంబులాచరించి వేదంబులకుసార్థక్యంబుగల్పించి, యనేకశ్రుతులను శిష్యులకుంజెప్పి ఖ్యాతులైన చోళపాండ్యదేశంబులందుండు పండితులారా మీకుదండంబు. కృశానువు? ఈమహ్యామరులందఱు మిథ్యావాదులే. వీరికినమస్కరింప నామతంబుగాదు. వీరలుప్రత్యక్షప్రమాణసిద్ధంబగు జగత్తు మిథ్యయందురు. అప్రత్యక్షంబగు బ్రహ్మంబునంగీకరింతురు. ఈయద్వైతులు మాయావాదులయి యశేషప్రపంచంబు మిథ్యయందురు. నిర్విశేషచిన్మాత్రంబగు బ్రహ్మంబు సర్వప్రమాణంబుల నతిక్రమించి నిర్గుణంబని వచింతురు. వింతయయ్యెడు బ్రహ్మబంధువులగు వీరుపరబ్రహ్మద్రోహులయిరి. బ్రహ్మంబు సర్వజ్ఞత్వంబుగలది హేయగుణరహితంబైనది. సంసారదుఃఖనివర్తకంబు వేదాంతశ్రుతంబు. అజ్ఞంబు సంసారఫలభోక్తృత్వంబుగలది. సంసారతాపియనిచెప్పుదురు. సగుణంబగు బ్రహ్మంబు నిత్యంబునాశ్రయంబుననియుపనిషత్తులుపల్కుచుండ వేదాంతంబులంబాటింపక కర్మకాండంబు నిరసించి కుమతులు జగంబుమిథ్యయని బ్రహ్మంబుమాత్రముండునని చెప్పుదురు వీరలు వేదంబులేగాదు వ్యాసునికిద్రోహులె. వ్యాసులు బ్రహ్మజ్ఞానంబుకొఱకు శాస్త్రంబునిర్మించె. బ్రహ్మంబు వాఙ్మనోగోచరంబని వాదించువారయోగ్యత్వము నాపాదించిరి. విరుద్ధబుద్ధులగు ఈ

మాయావాదులు భగవద్గుణానులెఱుంగనేరక విపరీతమార్గమునే చెప్పె
దురు. వీరుమఱియు సర్వజ్ఞునజ్ఞుడనియు సర్వశబ్దవాచ్యునవాచ్యుడనియు
కళ్యాణగుణునిర్గుణుడనియు, వేదవేద్యునవేద్యుడనియు పల్కుదురు. స
మస్తపాపరాశిన్యసనాకులులును, కించిదజ్ఞులునునగు జీవులకును అపరి
చ్ఛిన్నుడును, నిత్యానందుండును నగు భగవంతునికిని భేదంబులేదందు
రు. వీరుమదగజంబునకునకును దోమపిల్లకును భేదములేదనరాదా?
దృశ్యంమిథ్య, కర్తమిథ్య. మిథ్య మిథ్య, కావున సర్వంబుమిథ్యయె.
అట్లని యధిష్ఠానంబగు బ్రహ్మంబు నేలమిథ్యగాకూడదు. విశ్వాసనువు
వయస్యాయిట్లు విప్రులదూషింపకుము. వంశపరంపరగా కులాచారంబు
దప్పక జగన్మిథ్యావాదంబుచేయు నద్వైతమతంబు విడువక వేదాభ్యాస
నంబుజేయుచు నాస్తిక్యబుద్ధితో కర్మంబునొనర్పుచునుండు నద్వైతుల
తోతులగలమతస్థులేరిచెప్పు, స్మృత్యుక్తవిధిననుష్ఠాతలగు నీస్మార్తు
లు, వేదములు చదువుదురు మంత్రంబులు జపింతురు. యజ్ఞంబులుచే
యుదురు. దానందులిత్తురు. శ్రాద్ధంబులు జరుపుదురు. కావున వీరువే
దంబు ప్రమాణంబని యొప్పికొనిరి. కృశానువు? అంతట గలయుంగ
నుంగొని యీదేశంబులు నిస్తులంబులయ్యు శైవభూయిష్టంబులగుట
శ్లాఘార్హంబులుగావు. వీరుతత్పదార్థంబు యథావస్థితి నెఱుంగనేరక
మోహముపడుచుండిరి మహాగుణనిధియు, పరమపురుషుడును, నిత్యశ్రు
త్యాశ్రియుడును, వీతాతంకుండునగు విష్ణువుండ శూలోపేతుండును,
మనోభవదాహకుండును నగు పశుపతిని బూజ్యుడని శైవులందురు. సూ
ర్యునివలన నారోగ్యమును, అగ్నివలనసిరియును. శివునివలన జ్ఞానంబును
ముకుందునివలన మోక్షంబును గలుగునని వేదంబువచింపుచుండ శైవు
లు భవభయహరణంబునకై భవుంగొల్చెదరు. విస్మయంబయ్యెడు.
నిత్యసూరులు సేవింపుచు, నిర్మలము, జ్ఞానానందస్వరూపము తమః
పారంబునై వైకుంఠంబుండ దానినొల్లక యకటా శైవులు భూతభే
తాళజాతభీతిదంబునునశ్వరంబునగు మహేశ్వరపదంబు గోరుదురు. వి
శ్వాసనువు సఖుడాగుణంబు గ్రహియించి కౌతూహలంబునొందుము.

నిత్యంబిట్లె వృషభులమై స్నానసంధ్యాదికర్మంబులాచరింతురు. వేదశాస్త్రాదులభ్యసింతురు. యజ్ఞంబులొనర్తురు అతిథులం భక్తింతోబూజింతురు. ద్రవ్యంబులకు దగు పాత్రంబునింబూజింతురు. ఇట్టిధర్మములుగల వీరియెడల కించిద్దోషంబుగలిగినను సహింపరాదా. మఱియువినుము. ఇష్టుడుచేయు శివపూజవలన ఉత్తరజన్మంబున హరియందు భక్తిగలుగును. పాపంబులుపోవును మోక్షంబుగలుగును కావున నీజన్మంబున శివపూజ చేయుటచే ఫలహానిలేదు. మఱియు విష్ణుభక్తింగోరు శివభక్తివలన భద్రంబగు శివభక్తిగలవాని దారలుజారలుగారు. ధర్మపరాయణులై యుందురు. విష్ణుద్వేషంబె యశేషదోషంబులలో విశేషంబై నదివిను. విష్ణుద్వేషంబు విషంబువలె నాస్తిక్యంబుం బుట్టించును. నరకంబుగలిగించును. పారిశల్యంబునుగొట్టును. సంపదనశింపజేయును. ఆయుస్సు తగ్గించును. సమస్తపాపంబులు గలిగించును సత్యమట్లయినను అద్వైదికవృత్తులై శివభక్తినభినయించు పాషండవేషంబు హృదయంబునకు భయంబుగలిగించెడి అభవ్యమార్గ మాశ్రయించి లలాటంబులబూడిదెపూసికొని జడలుధరించి వేదోచ్చారణంబుమానిశ్మశానాగ్నిసదృశదృశులై పిశాచములంబోలె వీరలు తిరిగెదరు. వీరలరీతిమతికి జుగుప్సగలిగించెడిని మానహీనులును, సిద్ధిరహితులునై యీపాషండులు గిరీశుంబక్షీకరించి లింగదర్శనంబున ధనంజయాప్తింగోరుదురు. మఱికొందఱు దీర్ఘంబులువంకరలునగు నఖములుగలిగి గర్దభతుల్యులై శౌచమైన జేయక యూర్ధ్వబాహులై నీచులభ్రమింపజేయుదురు.

విశ్వావసువు? గుణంబులైకొమ్ము. వీనిదగడకుము. జితేంద్రియులై శీతాతపంబులుసహించి కష్టంబులగు నుపవాసంబుల గృశించిన కళేబరంబులుగలిగి పుణ్యస్థలయాత్రలుచేసి పాపంబులం బాఱద్రోలిన యీపాషండులయందివి గుణంబులుగావె. అనికొండొకయెడ నీక్షించి శంకింపుచు వీరెవరోయుదయముననె లేచి పుస్తకహస్తులై తిరుగుచున్నారు? కృశానువు చక్కగచూచినవ్వి, జ్యోతిశ్శాస్త్రమహాసముద్రంబునం సామాన్యవిశేషరూపంబులను కల్లోలంబులోని కొన్నితుంపురుల

ను లోకంబులు నేర్చి తాము మహాపండితులమని తలచి ధనికులయింట్లకుం జని యీజ్యోతిషికాధములు నీకాయువుగలుగును. నీకుభాగ్యముగలుగును. నీకుబిడ్డలుకలుగుదురని మాయచేసిచెప్పి ధనము నాకర్షింతురు. యీదృశులగు దైవజ్ఞుడు జాతకములు వ్రాయుదురు. అదిమంచిదిగానీ, చెడ్డదిగానీ, ఫలముకనుపించునేని తనమహాత్మ్యమునులేనిచో లగ్నముహూర్తమును, తనసామర్థ్యలాగును, మనుష్యులకు సుఖదుఃఖరూపంబులగు ఫలంబులువిధి నిర్మితంబులై గలుగుచుండుగాని, దైవజ్ఞుండు నేనిదివరకె చెప్పితినని బొంకు. విధినియమితములైన ఫలంబులనుభవింపవలసిన జనులకే జ్యోస్యంబు చెప్పవాడు. మేషవృషభమిథునాదిరాశి పరిగణనంబు చేయుచు నేర్పుముడిచి జనులభ్రమగొల్పును. దైవజ్ఞుడ సత్యవాదియగునేనివాని వచనంబులు వినుటేలా శరీరధారులు తమపూర్వకృతపుణ్య పాపరూప కర్మంబులంబట్టి సుఖదుఃఖరూప ఫలంబులనుభవింతురు. అదిమొదలనే దైవజ్ఞుడు చెప్పెనేని యుపాహా పిమ్మట దానన్నేమిగలదు చెప్పుము. విశ్వాసముఖ ఐహికాముష్మిక కర్మానుభవజ్ఞానపాప యోగులగు సిద్ధాంతుల నిందింపకుము.

ఎచ్చట దైవవిదుండుండ డచ్చట దైవసిద్ధ కార్యంబులు సలుపవీలుండదు. తార తెలియదు. నక్షత్రగ్రహచారంబు తెలియదు. తిథులు తెలియవు కావున జ్యోతిష్కులపలుకులు వ్యాపలని తెలిసినవారనరు. సూర్యచంద్రగ్రహణంబులు ముందు తెలిపనేని పుణ్యస్థలంబులకుంబోయి తానంబాడి తాపత్రయానలంబు చల్లార్చవచ్చు. శుభప్రాప్తి ముందు తెలియంబడెనేని మనంబునకుత్సాహంబును, సంతోషంబునుగలుగు. అనిష్టప్రాప్తి తెలిసెనేని, జపహోమాదులచే శాంతిగావింపవచ్చు. కావున దైవజ్ఞవచనంబుల విశ్వాసంబుంపవలయు. చంద్రునివృద్ధిక్షయంబులు, సూర్యచంద్రులగ్రహణంబులు, గ్రహోదయాస్తమయంబులు మొదలగు ఫలంబులం జనులు గనుచుందురు. కావున స్థాలీపులాకన్యాయంబున దైవజ్ఞునివచనంబులన్నియుం బ్రమాణ్యంబులెయగు. దైవజ్ఞుడు లేని గ్రామంబు, పండితుండుండని రాజసభను వేదములుగని [illegible]

త్రిని రాజులేనిరాష్ట్రమును, శుచిగానుండనిభార్యను, హాచరిత్రలేని
కావ్యమును, విషయములను బోధింపలేనిగురుని బుద్ధిమంతుడగువాడు
విడువందగు. కృశానువు? అల్లియుని యొక్క దెసం పరీక్షించి యుపహసిం
చి మిథ్యలగు నౌషధంబులచేతను అబద్ధకషాయములచేతను అసహ్య
ములగు లేహ్యములచేతను మంచివిగాని తైలములచేతను వైద్యులగువి
రోగులను మొఱంగి తమకడుపులు నింపుకొందురు. ఈమాయావై
ద్యులకు ధాతుజ్ఞానములేదు. వైద్యశాస్త్రంబు దెలియదు. రోగనిదాన
ము దెలియదు. వస్తుగుణంబు తెలియదు. అట్లయినను వైద్యులనిచెప్పి
మూర్ఖులును ఆర్తులునగు రోగులప్రాణధనములు మృత్యుభృత్యులై లా
గుదురు. కషాయములవలనను లంఘనములవలనను రోగముకుదిర్చి తన
యౌషధమువలన రోగముకుదిరినదని చెప్పి వైద్యుడు రోగియొద్ద సొమ్ము
రాబట్టును. విశ్వావసువు? లోకోపకారులగు వైద్యులయెడ వయస్యా
దూషణందగదు. రోగిశిరోవేదనంబు గలిగి స్వరంబు సన్నగిల్లి జ్వరంబు
చే శరీరంబున తాపంబుగలిగి యింద్రియంబులు క్షీణించి, బంధువులుని
రాశులయి దుఃఖింపుచుండ నాడికనుపడకయుండ ధైర్యముకలిగించి రో
గోపశాంతికలిగించు వైద్యునికంటె నుపకారిగలడె. లోకంబునజనులు
దైవవశంబున రోగంబులుగలిగెనేని వైద్యుడని వాడుకపడినవానిని శా
స్త్రము దెలియనివానినైన బిలుతురు. లోకోపకారి రోగముకుదురునట్లు
చేసిన వైద్యుని జనులువిడుతురు కృతఘ్నులుగారా! ఇది కష్టమగువిష
యము. యజ్ఞముచేయించిన వెనుక ఋత్విజునితో యజమానియు రే
వుదాటించి గట్టెక్కించిన నావికునితో దాటినవాడును, యుద్ధమునబో
రి దెబ్బందిని జయముగల్గించినభటునితో ప్రభువును, గమ్యస్థానముచేర్చి
న వెనుక మోసినవానితో మోయించుకొన్నవాడును, జారలతో భోగిం
చినపిమ్మట వేశ్యలతో జూదరియు రోగనివృత్తి చేసినపిమ్మట వైద్యుని
తో రోగియు, సామిప్యాయవలసినచ్చునని ద్వేషపడుదురని కవులు వర్ణిం
తురు. విమానముముందునకుబోనిచ్చుచు కృశానువాక్షేపించుచు సఖు
డా శాస్త్రప్రతిషిద్ధపద్యములగునీకవులచర్యంజూడుము. కటకటా యీ

కవులంజూడుము చక్కనివాక్యములతో రమారమణుం బ్రశంసింప సమర్థులయ్యు నల్పులును గుటిలులునగు రాజులను వర్ణించుచున్నారు. దూరంబునుండి రామనాథునభిషేకార్థంబు దెచ్చిన గంగాజలంబులు పాదులకుం బోయువారు గలరె. నుతించువారల పాపంబులంటు భయ మేరికలదు. అయినను కవులుమంచివాక్యములతో శ్రీని వర్ణింతురు. వృద్ధోపసేవ గాని రాజుద్రైవకిరీటధారణయోగ్యములగు మాణిక్యంబులు తెనకుక్కకు గట్టినట్లున్నది. విశ్వావసువు? అజ్ఞానతిమిరనివారకులగు కవులనట్లాడకుమా, వయస్యా! కవులుగొందఱు రాజులకు గృతులిచ్చియుండురైనను గొందఱు భగవంతునకొసగియుండుదురట్టి కవనంబులు వ్యర్థంబులు గావు. మహోదారుడైన ద్రవ్యంబుకొంత యపాత్రులకును నిచ్చును. పాత్రులకిచ్చియుండును దీనమహాపుణ్యంబు సంపాదింపజాలియుండును. శ్రేయఃప్రదంబగు భగవత్కథనే కవులు కావ్యముగ జేసి యందు శృంగారవీరాదిరసంబులు వర్ణింపవచ్చును. ఇట్లె వ్యాసవాల్మీకాదులు భారత రామాయణాదులం జేసినారు వానింజూడదగును. అదిమార్గంబగును. నరస్తుతిచేయుకవుల నిజముగ శ్లాఘింపగూడదని పండితులందురు. కవులవనీపతులం జక్కనిపద్యములం గూర్చి నుతింతురు. ఇతరులు నుతింతురుగాని వారిపలుకులు వినవింపులుగావు. కవులుపద్యంబులల్లుటలోను ఇతరులు చెప్పుటలోను భేదంబుగలదు. ఎట్లయినను నరస్తుతి దోషహేయగును. ధనాశయట్లు చేయుచున్నది. వాల్మీకి వ్యాస పరాశరాది పూర్వకవులు జగత్పూజ్యులయిరి. ఆధునికకవులగోష్ఠియును లోకోపకారకంబె కావున గుణజ్ఞులు ఆధునికకవులను బూజింపదగుదురు. మాఘమయూరాది మహాకవులందఱనేకగ్రంథంబులంజేసి వాసికెక్కిరి. వారికృతులవలన జగంబులకానందంబుగలిగె. సంపదగలిగినపుడు గర్వంబులేమియు, సాహిత్యంబుండెనేని పాండిత్యంబును, సమర్థుడగునేని పరోపకారమొనర్చుటయు, సామ్రాజ్యంబున్న దాక్షిణ్యంబును, ఔదార్యంబున్నం బ్రియవాదితయు, ఆచార్యుడగునేని జ్ఞానంబును గలిగెనేని యుత్తమంబని పెద్దలువచింతురు. ఇది తెలియుము. భక్తాగ్రేసరుండవు, భట్టినా

ధుడు, శఠారిసరోయోగి భూతయోగి, మధురకవి మొదలగు ధన్యాగ్రే సరుల శ్రీసూక్తులచే లోకంబులం బవిత్రంబులుగ జేయుదురు. కృశాను వు ? విమానంబునం బరపి పార్శ్వంబుగలయంగనుంగొని, చూడుమోయి తర్కశాస్త్రచింతనంబున నధికలహంబునొందెదరు వీరిం గంటె, కర్మం గూర్చి చెప్పెడు, మీమాంసాశాస్త్రంబును బ్రహ్మంబుం గూర్చి చెప్పెడు వేదాంతశాస్త్రంబు నెఱ్ఱకొనక యీతార్కికులు ప్రత్యక్షాదిప్రమాణం బులం గూర్చి ఘోషింపుచు నధికంఠశోషనొందుచున్నారు. పర్వతం బుపై పొగగలదుగాన నచ్చోట నగ్నియున్నది ఇదియనుమితికాదు ప్ర మాణమని వాదంబులుచేయు తార్కికుల వాక్కలహంబులచే సభాసం దులయ్యగఁగని జనులును ఈమేపాంపంబెంత బరువ్వుంపును. ఈకాకికి దంతములెన్నగలవు. అని నిరంతరపరిశీలనలచే పండితులగుదురు. ఈతా ర్కికులవాదంబులు వ్యర్థఫలంబులు. కంటివె యీతార్కికుడు, వేదవా సన లెఱుగడు. వేదాంగములుముట్టడు. ఒకప్పుడైన బురాణములుజదువ డు. స్మృతులులెక్కగొనడు. పరలోకసాధనప్రయత్నము విడిచి యక్క రకురాని కుతర్కముల యొక్కవాదముతో తనయాయుస్సు వెచ్చబు చ్చుచున్నాడు. ఈమూఢులగుతార్కికులు కష్టపడి కుతర్కంబులు కొ న్ని చదివి, అవచ్ఛేదక, వ్యాప్తి, అనుమితి, ఇత్యాదికొన్నిపదంబులు వాచోవిధేయములుగజేసి సభలకేగి, ఘటః, పటః, ఘటాత్, పటాత్, ఇత్యాది కర్ణకఠోరంబులగు శబ్దోచ్చారణంబులతోనుండి లజ్జింపక ప ఠింతురు. కాని వారింజూచినంబండితుండు సిగ్గుపడును. విశ్వావసువు: వివిధోపాయులగు వీరిని నవమానింపకుము తర్కంబుచదివిరేని మో హంబునశించి బుద్ధినిర్మలంబగును సంస్కృతభాషావ్యవహారశక్తి కలు గును. వేఱొకశాస్త్రంబునేర్చుకొన సాహాయ్యంబగును కనుకతర్కశా స్త్రాభ్యసనంబు నిందింపకుము. కాలంబంతయు కావ్యపఠనంబున నెప్పచ్చి వ్యాకరణశాస్త్రపారంగతుడయినను తర్కంబు చదువడేని సభలో వా దంబునచ్చనేసి నోరెత్తలేడు. ఇంతకంటె నవమానంబుగలదె. వేయే ల, ఈపండితులు లక్షణమెఱుగరు. పదార్థతత్త్వమెఱుగరు. వీరియుక్తు

హనుమానంబుగ ఆగమహూపవిచారియు, అధికరణ సహస్రశిక్షిత విప
క్షుండును యోగియునగు జైమినిస్వామియెడ మదీయహృదయంబను
రాగిల్లియున్నది శబరకుమారిల పార్థసారథ్యాదులు, విశ్వమాన్యులై
తంత్రంబులంబోషించి జయమునందెదరు. అట్లగునని విమానమన్యది
శకు నడిపిచూచియు పహసించి టిడ్ఢాణ్ దఘ్నఞ్మాత్రచయప్ఠక్ఠఞ్, డుకృ
ఞ్ కరణే, యనియిట్లు సూత్రంబుల జదువుచు, కర్ణకఠోరంబులగు శ
బ్దంబులుచ్చరింపుచు వైయ్యాకరణులు కాలంబుపుత్తురు. పాణినిచేసి
న సూత్రంబులంజదివి శబ్దనిష్పత్తిందెలిసియు ఈవైయాకరణులు, వి
ష్ణుంగృతులంచే గీర్తింపలేక వ్యర్థశ్రములయ్యెదరు. సమస్త పదార్థజా
ంబులు పక్వంబుచేసి మందాగ్నిగలవారల భుజింపవేడినట్లున్నది. ధరణ్యా
భరణులగు వైయాకరణులయెడ లేపక్లేశంబులాపాదింపకుమని విశ్వా
వసుంపు. కృతదురిత నిరాకరణంబగు వ్యాకరణంబుచదివిన చతురుడు
పండితుల లెక్కించునపుడు కనిష్ఠికయందేచేరును. పాతంజలాభ్యాసం
బును, విష్ణుభజనంబును, గంగాస్నానంబును మరణపర్యంతంబు పవిత్రం
బుచేయునని వైయాకరణులు చెప్పుదురు. వ్యాకరణశాస్త్రంబుచదువ
నివారనవులు పండితసభలందు ధనుర్విద్యాకౌశలంబులేనివాడు. నేరని
వాడు, నతిరథులుగల యుద్ధభూమింబోలె జొరజాలరు. వ్యాకరణౌష
ధంబు పుచ్చుకొనినవారు వాక్పటుత్వంబు గలిగియుండరు. ఏదేనియొక
మాటపలికినను శరీరమున కంపముగలుగును. కృశానువు? శతకోటిపా
ణినిగదితమగు వ్యాకరణముకంటె పాణినిగదితమగు వ్యాకరణమాదరిం
పబడెడు, శబ్దతత్వంబు నిర్దుష్టంబుగ జెప్పంగావునంబాణిని వ్యాకరణం
బె యనౌపాధికంబుగ నాదరింతురు. పాణినిసూత్రంబు కంఠంబునంబెట్టి
న సువృక్సముద్వాహంబగుగాదే. బుధుండు వర్ణధర్మంబులెఱింగి విధివం
తంబుగ బ్రయోగించుంగదా అని విమానము నొండొకదిశకు కదలిం
చి ముందటగనుంగొని సఖుడా ధనచపలత్వంబున నామ్నాయంబుల వి
క్రయించు ఛాందసులంజూడుము. చిత్తచాపల్యంబునన సంతుష్టులైనెల
నెల జీతంబులంగొని శిష్యులకు వేదాధ్యయనంబుచెప్పెడు ఛాందసులం

నువ్వు, సిద్ధాంతంబునకుం బూర్వపక్షంబుంబోలె. సమస్తవస్తువులను గుణములు బలపడుటకె నిందించుటనాశ్రైలి. ఇట్లుజనంబుల స్వభావంబులు చెప్పికొనుచు మధుమథన పవిత్రక్షేత్రంబులసేవించి, ధన్యులై, మార్గంబున సత్యంతసఖ్యంబునం బ్రమోదింపుచు సుఖంబుగ కృశానువిశ్వావసులు నిజగృహంబులకేగిరి. సకలలోకకుశలంబులుగలుగ దివ్యదేశంబుల సర్వోత్సవాదులు వర్ధిల్లుగాక. అపగతభవరోగులై యజ్ఞంబులోని ద్విజులు మేలుపొందుదురుగాక. లక్ష్మణార్యపక్షంబు జయమొందుగావుత. వేదాంతదేశికుల వచనంబు జయంబందుగాత. వేదమార్గంబభివృద్ధింబొందులుగాత. ప్రసన్నుడై శ్రీనివాసుఁ డంజనగిరియందు వర్ధిల్లుంగాక. బహుదోషపరిహరమగు నాగరికంబునెడల సజ్జనులు కృశానువులుగాక కరుణించి ప్రసన్నులై విశ్వావసుతులై యుండవలెనని వేడెద॥ శ్రీ. శ్రీ. శ్రీ.

సంపూర్ణము.

౧౮. పేజీలో. భిల్లపల్లికి. అర్థము ॥౧ హిరణ్యపురం ఖరశబరగ్రామం.



మంగు వేంకటరంగనాథరావు,
బుక్కు–సెల్లరు, గోదావరిజిల్లా కాకినాడ.

